గోలకొండ పత్రిక

ప్రథమ సంవత్సర మాఘ బ॥ ౯

బుధవారము

# స్త్రీవిద్యా మహాసభ

స్త్రీల యభివృద్ధియెడ నానాటికి శ్రద్ధ హెచ్చుచుండుట సంతోషకరము. అందును, తమ యభివృద్ధికై పురుషులపైననే యాధారపడి యుండక, స్త్రీలు తమంతటతామే ప్రయత్నములు సలుపుచుండుట ప్రశంసార్హము, శుభకరము. కొలది కాలమునుండి, ప్రతియేడును ఏదియో యొక స్త్రీల సమావేశము జరుగుచునే యున్నది. తీర్మానములలో తమ ఆశయములను, కోరికలను ప్రకటించుచు, సముచితమైన సంచలనము గలిగించుచునే యున్నారు. కాని తదితర సమావేశములకంటె మొన్నటి ఢిల్లీ సమావేశము కొన్ని విషయములలో నెగడదగినది. ఆ సెసన్ కి స్త్రీవిద్యాలయమును వైసుఛాన్సలరుగా, స్త్రీలయభ్యున్నతికై, విద్యావ్యాప్తికై నిరంతర కృషిసలుపుచున్న భోపాలు మహారాణిగారే సమావేశమున కధ్యక్షత వహించుటయే అస్పష్టమునవచ్చును. ఆదియును గాక పాశ్చాత్య విజ్ఞాన పారీణయగు ఇర్విన్ ప్రభ్విణి యమూల్యమగు సందేశము నొసగి, ఈ సమావేశ సమాలోచనములకు గన్నెదెచ్చిరి. భారతదేశమందలి వివిధ ప్రాంతములనుండి ప్రతినిధులు విచ్చేసి, ఈ సభయందు పాల్గొని, విపులచర్చ యనంతరము గావింపబడిన తీర్మానములకు విలువ నాపాదించిరి.

స్త్రీలకువిద్య అత్యవసరమనియు, విద్యావ్యాప్తికి పలుభాషలు, పేదరికము, అజ్ఞానము, ఉపేక్ష, ప్రతికూల ప్రజాభిప్రాయము, సాంఘిక నడతలు, ఆచారములు, రాజకీయములు, అంతరాయములు కల్పించుచున్నవనియు, బాల్యవివాహము, ఘోషాపద్ధతి నిరసించవలెననియు, ధృవపరచుటలో విశేషమేమియులేదు. ఇవియందరికీ దెలిసిన విషయములే. ఇందు ప్రశంసింపదగిన దేమియు లేదు.

ఈ సమావేశమును ముఖ్యముగా మూడు విషయములకయి మేమభినందించుచున్నాము. అందు మొదటిది బాలికలకు నిర్బంధ ప్రాథమికవిద్య ముఖ్యమని నిర్ధారణ చేయుచు, దీనికై ప్రభుత్వమువారిని, స్థానిక సంఘములను, తగిన ఆర్థిక సౌకర్యముల నొసగవలెనని కోరినది. కేవలము అస్పష్టముగ, ప్రయోజనహీనముగా విద్య కావలెనని ఉపన్యసించి తనివిజెందక యీకోరిక కార్యరూపముగ ఫలవంతమగుటకుగాను ప్రభుత్వమును హెచ్చరించుట సమంజసము. స్థానిక సంఘమువారీ తీర్మానము ననుసరించి విద్యాశాఖాధికారులకు ఒత్తిడి కలుగజేసిరో. మంగళకరమగు ఫలితములు బడయవచ్చును.

ఈ సందర్భమున భోపాలు మహారాణిగారి సూచన యెంతయు బాగడదగి యున్నది. ప్రభుత్వమువారు పూనుకొనిన పనులు చేతులు ముడుచుకొని చేచియుండుట యుక్తము కాదు. అదియునుగాక భారత ప్రజలు కడుపేదవారు. సగటున ఒక్కొక్కరికి నెలకు రూ. 2-8-0 మాత్రమే ఆదాయమని గణించవలెను. ఇట్టితఱి, ప్రతి గృహస్థును తన బిడ్డల విద్యకొరకై తగినంతధనము వెచ్చింపలేడుగదా! ఇట్టినిక్కపగలకొఱకొక సూచిత పద్ధతిని మహారాణిగారు సూచించి యున్నారు. విద్యావతియగు ప్రతి స్త్రీయును తన తీరుబడి కాలములో కొంతసమయము మీబీదబిడ్డల బోధనకయి వినియోగించినచో దేశమునకమూల్యమగు సేవచేసిన వారగుదురు. దీనివలన ప్రస్తుతపు పాఠశాలల కొఱతయు, ఉపాధ్యాయినుల కొఱతయు కొంత వరకు దీరును.

స్త్రీవిద్యా విధానము గూర్చి జరిగినచర్చ కొనియాడదగిన రెండవ విషయము. నేటిబాలికల విద్యావిధానము, బాలురవిద్యా విధానమునే అనుకరించి యున్నది. ఇది సరియయిన పద్ధతి కాదు. దీనివలన స్త్రీవిద్య యొక్క ముఖ్యాశయములు విఫలమయి పోవుచున్నవి. శారీరక మానసిక, నైతికాభివృద్ధికి దోడ్పడునది విద్య. పురుషుల ప్రయత్నములకు చేదోడు వాదోడుగనుండి, కష్టసమయములలో సాహసమొసగుచు, గృహమును శాంతి సుఖధామముగ చేయుటకుగాను విజ్ఞాన వికాసము నొసగుట స్త్రీవిద్య యొక్క ముఖ్యాశయము. పురుషులకొఱకేర్పరచబడిన విద్యావిధానము ననుసరించి యుండినచో, స్త్రీవిద్య యీ ఆశయమును పూర్తి చేయజాలదు. అట్టివిద్య నిష్ఫలము.

స్త్రీల యవసరములువేరు. వానిని గుర్తెఱిగి తదనుగుణ్యముగ విద్యగఱుపవలెను, అనుదిన జీవనమున కుపయోగపడునట్లు గృహమేధి అర్థశాస్త్రము, (Domestic Economy) ఆరోగ్య సూత్రములు, చికిత్సలు మున్నగునవి వీరికితప్పక గఱుపవలెను. తదుపరి కళలు, శాస్త్రములు మొదలగు గల ఉన్నత విద్యలు వలయువారభ్యసించుటకయి ప్రత్యేకముగ ఏర్పాటులు చేయవచ్చును. విద్యావిధానములో ఇండియా నేడొక మార్గసంధినిలే యున్నది. ఇకమీదట స్త్రీలు ఏమార్గము నవలంబించవలెనో నిశ్చయించునెడ పైవిషయమును శ్రద్ధతో గమనించవలెను.

ఇక మూడవ విషయము ఉపాధ్యాయినుల ఆవశ్యకత. బోధకులు (Teachers) సత్పౌరసూత్రధారులు. ప్రజాతిప్రతిభయైనను వీరి కృషిఫలితమే. చిన్నపిల్లల బోధనకు పురుషులకంటె స్త్రీల నియోగించుట శ్రేష్ఠము. శాంతి, సహనము, సానుభూతి వీరియందెక్కువ. అందుచే చిన్నపిల్లల మనోవైఖరిని గ్రహించుటయందును, [illegible]ముగ బోధించి పాఠముల నచ్చజెప్పుటయందును వీరు నిపుణులుగ నుందురు. అవసరమగు బాలికా పాఠశాలల నడుపుటకును, పూర్తిచేయుట కెందఱో సుశిక్షితలగు ఉపాధ్యాయినులు కావలసి యున్నారు. ఒక స్త్రీ కేవలము పరిజ్ఞానమున్నంతమాత్రముననే సద్బోధకురాలు కానేరదు. దీర్ఘదృష్టి, స్వార్థత్యాగము, స్వ[illegible]యందు శ్రద్ధాభక్తులు, కలిగియుండవలెను. విద్యాబోధన అత్యుత్తమ వృత్తియనియు దాని నవలంబించుట గౌరవ ప్రదమనియు ప్రతి బోధకురాలును నమ్మి కార్యమునకు పక్రమించవలెను. అప్పుడే వారికృషి దివ్యమగు ఫలితములకు కారణమగును. ఈ ఉన్నతపదవిని స్వీకరించుటకు ఉత్తమ తరగతుల స్త్రీలు పూనుకొనవలెను. ఈవృత్తియెడ నేడుగల తుచ్ఛభావమును మాని, భక్తి మర్యాదలతో జూచి, బోధకులకు సౌకర్యములు కలిగించుచు, ప్రోత్సాహము నొసగినగాని, ఈ యవసరము పూర్తి కాజాలదు. అంతేకాక విద్యావ్యాప్తికి నిరోధము కలుగుచునే యుండును. కాన ఈ బోధకుల శిక్షణకొఱకు ప్రభుత్వమువారు బోధనాలయముల స్థాపించునటుల స్త్రీవిద్యా సంఘమువారు ఒత్తిడి కలిగించవలెను.

# వ్యక్తి స్వాతంత్ర్యము

## చాట్రాతి లక్ష్మీనరసమాంబగారు

స్త్రీలకు స్వాతంత్ర్యమియ్యరాదనియు వనితలు బలహీనులనియు, స్త్రీలకున్నత విద్య యనవసరమనియు, స్త్రీ, పురుషుని ప్రాపంచిక సౌఖ్యమునకే సృజింపబడినదనియు చెక్కుమంది భావించుచున్నారు. స్త్రీలకు స్వాతంత్ర్యమీయుమని యే శాస్త్రమందున గానరాదు గాని పురుషులను దమకుఅధర్మములవదలి, మాంస భక్షణము, సురాపానము, సేవకావృత్తి, వారాంగనా సాంగత్యము, జూదసాత్క్యములిచ్చుట, చుట్ట, బీడి, సిగరెట్లు కాల్చుట, తలిదండ్రుల దూషించుట, ధర్మపత్నిని బాధించుట, మున్నగు కృత్యముల జేయుమని మాత్రము శాస్త్రములందు విధింపబడినది కాబోలు. శాస్త్రము స్త్రీ కొఱకే యేర్పడలేదు. స్త్రీ పురుషుల కిద్దరకునై యేర్పడినది. పురుషుడు స్త్రీని పాలించు వాడు భరించువాడు గాన, భర్త యనబడువంటుడు తిన విధినిదాను స్వకమముగ జేసికొనిన యతడు గడ యున్నలకు బోధించుటకు నన్యుల బాలించుటకు నర్హుడగును. (ఉదాహరణ) ఒక యుద్యోగస్థుడు తన న్యాయ్యమైన క్రమము దప్పినక్రమించినచో వాని యధికారమునుండి మన ప్రభువువారు తొలగించుచుండిరి గదా! పురుషులు ధర్మప్రవర్తనము నుండి పృథుపతనము నొందినచో ధర్మాధికారులెట్లయ్యెదరు? కొందఱు పురుషులు నీతి బాహ్యులై స్వప్రయోజనపరులై తమ యుత్తమపదములనుండి ధర్మచ్యుతి నొంది స్త్రీలను పలు తెరంగుల బాధించుటయు వారికి విద్యా వివేకములకవకాశ మీయకయు పసమంపోయుములనిరే వారి చేత నీ దేశోద్ధారకులగు మహాశయులు సభలందు స్త్రీ పురుషులు విద్య సమానార్హులని చర్చించుచుండిరి. ఇంక స్త్రీ, సభకు రాజవదని కొందరందురు. స్త్రీలకు పురుషులవలన బాధకలిగినప్పుడు తన్నివారణార్థము న్యాయస్థానమునకు వెళ్లుట లటస్థించుచున్నది. ద్రౌపది అంతఃపుర కాంతగదా, సభకు నేల వెళ్లినది? ఆమె భర్త ధర్మరాజు ధర్మచ్యుతినొందుటచేత గదా! ఆతడు ముందుతాను పందెము బెట్టుకొని పిదప ద్రౌపదిని పందెము పెట్టుటచేత తానావిషయమై సభ్యులను విచారించినది. పురుషుడు ధర్మమునుండి భ్రష్టుడయి స్త్రీని బాధించునప్పుడు స్త్రీ న్యాయాధికారికి చెప్పుకొనుట ధర్మవిరుద్ధమా? స్త్రీని పురుషుడు బాధించుట ధర్మమా! ఏమీ న్యాయవిచారము! స్త్రీ పురుషు లిద్దరు వ్యక్తిత కలవారగు పర్యంతము స్త్రీ చెత సాక్ష్యమును గనుక స్త్రీ విద్యావంతురాలు కానప్పుడు పురుషుడు యోగ్యుడు కానేరడు. స్త్రీలకున్నత విద్య పురుషులతో బాటు నేర్పించుట ధర్మమని పురుష లోకమునకు విన్నవించుటకై స్త్రీలు సభలకేగుచుండిరి. స్త్రీ పురుషుల క్షేమమునకై స్త్రీ చేయు కార్యము ధర్మవిహీనమా! పూర్వపు స్త్రీలు విశేషవిద్యావంతులు పెక్కండ్రు కలరు. రాణీ మర్గావతి పద్మినిబాయి, వీరమతి, రాణీ సంయుక్త, తారాబాయి విదుషిద్యావిశారదలగుటచేతనే కదా! శత్రువుల బారినుండి మానభంగము కలుగకుండ కాపాడుకొన గలిగిరి. కావున స్త్రీ పురుషులతో బాటు సకల విద్యల నభ్యసింపవలయును. పూర్వపు స్త్రీల మాట యటుండగ ప్రస్తుత కాలములో, పునహాలో కర్వేమహాశయుడు స్థాపించిన విశ్వవిద్యాలయములో నెందరు స్త్రీలున్నత విద్యావంతులై పాటుబడుచుండిరి? ఆ స్త్రీలు గర్భధారణ ప్రసవాది శిశుపోషణాది కార్యము లాచరించుటలేదా! భర్తలతోను, బిడ్డలతో గూడియుండలేదా? స్త్రీలనందఱే చపలలనె తెల్లువా? మన యాంధ్ర దేశమున గుంటూరులో నున్న లక్ష్మీబాయమ్మగారు నెలకొల్పిన శారదానికేతనము మీరు చూడలేదా? కాకినాడలో నాళం పద్మనాభమ్మగారు స్థాపించిన వైశ్యవితంతు శరణాలయము మీరు చూడలేదా! కొందరు స్త్రీలిట్టి ఘనకార్యముల జేయుచున్నవారు కారా? మఱియు స్త్రీ పురుషునకర్ధాంగి గదా! పురుషుడు విద్యావంతుడై స్త్రీ విద్యావిహీనురాలై యుండినచో, (విద్యా విహీనః పశుః) అని పురుషుని సగ శరీరము పశుత్వమును, సగము శరీరము నరత్వము గలదియగును. పురుషుడు నరసింహావతార పురుషుడగుట. ఇప్పటి పురుషులు నరసింహావతారులు గనుకనే స్త్రీలనిట్లు బాధించుచుండిరి. మఱియు పురుషుని ఐహికాముష్మిక ధర్మములగు నిత్య నైమిత్తిక కర్మములకు స్త్రీ సహకారిణి. కనుకనే, పురుషునకు స్త్రీ సహభాగిని యనబడుచున్నది. పురుషుని వలెనే స్త్రీ చైతన్యమునొందిన ప్రాణముగల, ఆత్మగాని, చేతనా రాహిత్యముగల నిర్జీవ ప్రతిమ కాదు. పురుషుని సౌఖ్యమునకే స్త్రీ యేర్పడలేదు. సకల ధర్మ కార్యముల సహకారిణిగ నుండుటకేర్పడినది. భోగకాంతయు ధర్మపత్ని యనదగునుగదా? ధర్మపత్ని భర్తతో బాటు సకల ధర్మములనెఱిగి భర్తకు సహకారిణి కావలయును గదా! ఇప్పటి స్త్రీలున్నత విద్యావంతులు గాకపోవుట చేతనే చాలమంది పురుషులు చేయు సత్కార్యములకు విఘ్న కారిణులగుచుండిరి. ఇంక ప్రకృతి ధర్మముచేత విచారించినచో స్త్రీ పురుషులకు జనన మరణములు సమానమే కాని భేదము కానరాదు. అనగా మాతృగర్భమున పురుషుడు జన్మించినట్లే స్త్రీ జన్మించుచున్నది. పరమాత్మలు పురుషునకును, స్త్రీకిని సమానమే కాని భేదములేదు. ప్రాపంచిక సౌఖ్యమునకును సమానార్హులే. సాంసారిక బాధ నష్టములకు, సుఖదుఃఖములకును సమానులే. తమ విధిని దాటినచో నిరువురును ప్రభువులచే దండింపబడుచుండిరి. మఱియు పారమార్థిక విషయమై విచారించినచో భగవంతుడు సృష్టికర్త. తక్కిన జీవులందఱు స్త్రీ ప్రాయులు అనగా, జీవుల పునరావృత్తి రాహిత్యమునకు భగవంతుడే యవధిగదా? కావున దైవము విశేష్యము. స్త్రీ సృష్టి, భగవంతునకు విశేషణము అనగా [illegible] ము. జీవుల బరిపాలించుటకు దైవమే కర్త. స్త్రీ పురుష భేదము ప్రాపంచిక సౌఖ్యమునకై యేర్పడినది కాని యితరము కాదు. స్త్రీలు విద్య నేర్చి చెడిపోవుదురని కొందఱందురు; చెడిపోవుటకు విద్య కారణము గాదు వారి గుణమే. (ఉదా) వర్ష జలము మధురమైనను చవిటి నేలమీద బడి యుప్పు నీరగుచున్నది గదా! ఇంక, స్త్రీలున్నత విద్య నేర్చిన ననారోగ్యులయ్యెదరనుటయు పాశ్చాత్య విద్య యన్యభాష గనుక స్త్రీలేకాదు పురుషులును రోగిష్ఠివారగుచుండిరి. ఇప్పుడు కన్నులకు జోళ్లు బాల్యమందే ధరించుచుండిరిగదా? పూర్వపు పురుషులిట్లు ధరించిరా? మనుష్య జాతియంతయు సమానధర్మము కలదిగాని భేదము గలదిగాదు. లోకసేవ జేయుటకు స్త్రీకిని విధియై యున్నది, కాన విధియని చేయుదురుగాని పరులు మెచ్చుకొనుటకై చేయరు.

చందాదారులకు మంచితరుణము! త్వరపడుడు!!

# గోలకొండ సంచిక

ఇంక ౫ మాసములకు మా పత్రికకు ౩వ సంవత్సరము ప్రారంభమగును. అప్పుడు ప్రత్యేక సంచిక యొకటి వెలువడును.

౧౦౦ పుటలకు పైగా నుండును. అనేక చిత్రపటములతో నుండును. సుప్రసిద్ధ పండితులు వ్రాయుదురు. వ్యాసములు, శాస్త్రచర్చ, పద్యములు, కథలు, చారిత్రిక పరిశోధన విషయములుండును.

చందాదారులకు ౧౦ అణాలు మాత్రమే. ఇతరులకు ౨ రూపాయలు.

ప్రకటనలు పంపువారిప్పుడే పంపుడు. ప్రకటన ధరలు చాల చౌక.

వివరములు తెలిసికొన గోరువారు— మేనేజరు

గోలకొండ పత్రిక

హైదరాబాదు.

అని వ్రాయుడు

ఈ పత్రిక ... ముద్రించబడెను

... ప్రకటించబడెను.

REG. No. N. 45.

REG. No. M. 218


గోలకొండ పత్రిక

సుల్తాను బజారు హైదరాబాదు, దక్కను

సంవత్సరము చందా రు. ౭-౦-౦

అర్ధ సంవత్సరము ,, ,, ౩-౧౨-౦

విడి పత్రిక ౦-౧-౮


శ్రీయుత

STAMP.

Printed and Published by K. Balakrishni Paidy at the Golkond Press, Troop Bazaar, Hyderabad Dn.